# 2

# తెలుగు వాచకం





ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ

107 - 13

# తెలుగు వాచకం
## రెండో తరగతి

Acc. No. 263


రచయితలు :

డాక్టర్ కాచినేని రామారావు శ్రీమతి డాక్టర్ బి. సరోజన

సంపాదకుడు :

డాక్టర్ వి. వి. ఎల్. నరసింహారావు

ప్రధాన సంపాదక మండలి :

ఆచార్య కె. కె. రంగనాథాచార్యులు, అధ్యక్షులు

ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి, సభ్యులు

డాక్టర్ అంతటి నరసింహం, సభ్యులు

డాక్టర్ ముదిగొండ వీరభద్రశాస్త్రి, సభ్యులు

చిత్రకారుడు :

శ్రీ టి. ఎద్వర్డురాజు








ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రచురణ

హైదరాబాదు


అంటరానితనం నేరం అంటరానితనం అమానుషం

అంటరానితనం పాపం అంటరానితనం రాజ్యాంగానికే విరుద్ధం

*First Published, 1994*, 1995.



This Book has been printed on 60 G.S.M. Paper
Title Page 150 G.S.M. Paper

*Price :* Rs. 2 - 00 Paise

**Printed in India**

*Printed at :* ARUNA WEB-OFFSET PRINTERS,
SRT-59, RISALA, HYDERABAD - 500 020.
for the Director, A.P. Govt. Text-book Press
Mint Compound, Hyderabad.
Andhra Pradesh.

# పరిచయం

ఈనాడు భాషావసరాలు విస్తృతంగా పెరిగాయి. సాహిత్యావసరాల కోసమే కాకుండా, విషయ ప్రధానమైన వివిధ శాస్త్ర శాస్త్రేతర అంశాలను గ్రహించడానికీ, వ్యక్తీకరించడానికీ, మనం భాషను వినియోగించుకొంటున్నాం. ఈనాటి పాఠకుల్లో కొందరు సాహిత్యంలో కృషిచెయ్యడం కోసం భాషను అభ్యసించవచ్చు. మరికొందరు ఇతర ప్రయోజనాలకోసం అభ్యసించవచ్చు. ఇతర ప్రయోజనాలంటే సామాజిక శాస్త్ర విషయాలనో, శాస్త్ర విజ్ఞాన విషయాలనో భాషద్వారా అభ్యసించడం అన్నమాట. భాషావసరాలు పెరిగేకొద్దీ భాషాబోధనా వ్యూహం కూడా మారుతుంది. ఈ మౌలిక లక్ష్యంతో ఈనాటి బాలబాలికల సామాజికావసరాలనూ, భాషావసరాలనూ దృష్టిలో ఉంచుకొని ఈ పాఠాలను రూపొందించడం జరిగింది.

ఈ మౌలిక లక్ష్యాలకు స్ఫూర్తి 1986 నాటి మన జాతీయ విద్యావిధానం. ఈ జాతీయ విద్యావిధానంలో పొందుపరిచిన లక్ష్యాలు ఆధారంగా ఆచార్య కె. కె. రంగనాథాచార్యులు అధ్యక్షతన ఒక ప్రత్యేక సంఘం ఒకటో తరగతినుండి, పదో తరగతి వరకూ పాఠ్యప్రణాళిక రూపొందించింది.

ఈ రెండో తరగతి వాచకం ఒకటో తరగతి వాచకంలోని అంశాల పునశ్చరణతో ప్రారంభమౌతుంది. మహాప్రాణాల గుణింతాలూ, వాటితో కూడిన పదాలూ ఇవ్వటం జరిగింది. ఒత్తులను పరిచయం చేయడంలో రూపభేదం ఉన్నవాటిని మొదట ఇచ్చి, రూపసామ్యం ఉన్నవాటిని తరువాత ఇవ్వటమైంది. రకరకాల సంయుక్తాక్షరాలనూ వాటిపై అభ్యాసాలనూ విద్యార్థికి బాగా మనసుకెక్కేటట్లు చూడటం జరిగింది.

మహాప్రాణాలనూ, సంయుక్తాక్షరాలనూ ప్రవేశపెట్టడంలో, కొన్ని కఠిన పదాలను చేర్చక తప్పలేదు. వాటిని పిల్లలకు పరిచయం చెయ్యడంలో ఉపాధ్యాయులు ఉపాధ్యాయినులు ప్రత్యేక శ్రద్ధ చూపడం అవసరం.

బాలబాలికలు పాడుకొనేందుకు వీలుగా గేయాలూ, జానపద గేయాలూ, బాలసాహిత్యగేయాలూ చేర్చడమైనది. వీటిని పిల్లలచేత పాడిస్తూ ఉంటే ప్రయోజనకరంగా

ఉంటుంది. సాంప్రదాయికమైన పండుగల గురించీ, జాతీయ పర్వదినాల గురించీ ప్రత్యేక పాఠాలు రూపొందించబడ్డాయి. పరిమిత కుటుంబం, జాతీయతా దృక్పథం, పోషకాహారపు అవసరం, పరిశుభ్రత మొదలైన అంశాలు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో పాఠ్యాంశాలలో చోటు చేసుకొన్నాయి. ఉపాధ్యాయినులు ఉపాధ్యాయులు ఈ అంశాలను తమ బోధనలో మరింత విశదం చేస్తే మన లక్ష్యం నెరవేరుతుంది. అభ్యాసాలు చాలావరకు బాలబాలికల సృజనాత్మకతను పెంపొందింపచేసే దృష్టితో ఇవ్వబడ్డాయి. కొన్ని నీతి వాక్యాలను అక్కడక్కడ పాఠాల క్రింద చేర్చడం జరిగింది. ఉపాధ్యాయులు ఇలాంటి నీతివాక్యాలను మరికొన్నిటిని సేకరించి విద్యార్థులచే అట్టలపై రాయించి తరగతి గదిలో గోడలకు అతికించేట్లు చూడాలి.

అన్ని తరగతులకు మాదిరిగానే ఈ తరగతికి కూడా వాచకం చివర అకారాది క్రమంలో పదపట్టిక ఇవ్వడం జరిగింది.

ఈ వాచకంలో ' సుభాషిత రత్నావళి 'ని చేర్చడం జరిగింది. వీటిని నేరుగా విద్యార్థులే చదువుకోవాలనే ఉద్దేశంతో మాత్రం చేర్చలేదు. భారత రాజ్యాంగంలోని లౌకిక సూత్రాలకు అనుగుణంగా విలువలతో కూడిన విద్యా విధానాన్ని ప్రవేశపెడుతున్నాం. వ్యక్తిగతమైన విలువలు, సామాజికమైన విలువలు, జాతీయమైన విలువలు విద్యార్థి తరానికి అందించాల్సిన బాధ్యతను గుర్తించి ప్రభుత్వం ఈ ప్రయత్నం చేస్తున్నది. పాఠశాలల్లో ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు, ఇంటివద్ద పెద్దలు తాము సావధానంగా చదివి అవగాహన చేసికొని బాలబాలికలకు ఇందులోని విషయాలు బోధపరచి వాటిని ఆచరణ సాధ్యం చెయ్యాలని సంకల్పం. సాధారణ పాఠాలతోబాటు ఉన్నత మానవత్వపు విలువల్ని వివరించే ఈ అంశాలు బాలబాలికలకు తెలిస్తే వారు ఉత్తమ మానవులుగా, ప్రేమమూర్తులుగా రూపొందే అవకాశం కలుగుతుంది. ఇందుకు విద్యావ్యవస్థతో సంబంధమున్న ప్రతిఒక్కరూ సహకరిస్తారనే మా నమ్మకం.

ఈ పాఠ్యాంశాలకు సంబంధించిన సలహాలను ఇవ్వదలచినవారు వాటిని నేరుగా పాఠశాల సంచాలకుల కార్యాలయానికి పంపించవచ్చు.

# విషయ సూచిక



—0—



# వందేమాతరం

బంకించంద్ర చటర్జీ

వందేమాతరం
సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్యశ్యామలాం మాతరం; వందేమాతరం
శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం
పుల్లకుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం వందేమాతరం.



భావం : భారతమాతకు వందనం. తియ్యని నీటితో, కమ్మని పండ్లతో, చల్లని గాలులతో, పచ్చని పైరుతో విలసిల్లే భారతమాతకు వందనం. రాత్రులు తెల్లని వెన్నెలలతో పులకిస్తూ విరబూసిన చెట్లతో శోభిస్తూ స్వచ్ఛమైన నవ్వులతో, మధురమైన మాటలతో మాకు సుఖాలు కలిగిస్తూ వరాలనిచ్చే భారతమాతకు వందనం.

ఉపాధ్యాయులకు సూచన :

స్వాతంత్ర్యసమరంలో వందేమాతరం గీతం యావద్భారతదేశాన్ని ఉద్రూత లూగించింది. దీన్ని స్వాతంత్ర్య విప్లవగీతంగా భారతీయులందరూ గానం చేశారు. ఇది బ్రిటిష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా సింహగర్జనలా మారుమ్రోగింది. దేశభక్తికీ, స్వాతంత్ర్య పిపాసకూ ఈ గీతం ప్రతీకగా నిలిచింది. ఈ గీతం బంకించంద్ర ఛటర్జీ వ్రాసిన 'ఆనంద్ మఠ్' నవలలోనిది.

ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి. భావం చెప్పించాలి.





# సారే జహాఁ సె అచ్ఛా

– మహ్మద్ ఎఖ్బాల్

సారే జహాఁ సె అచ్ఛా హిందు[illegible] హమారా
హమ్ బుల్ బులేఁహైఁ [illegible]స్‌కే, [illegible]ల్ సితాఁ హమారా ॥

పరబత్ వో సబ్ సే ఊంఛా [illegible]యా ఆస్మాఁ కా
వో సంతరీ హమారా ! [illegible] హమారా ॥

గోదీమె ఖేల్‌తీహైఁ ఇస్‌కీ హజారోఁ నదియాఁ
గుల్‌షన్ హై జిన్ కే దమ్ సే రష్ కె జినాఁ హమారా ॥

మజ్ హబ్ నహీఁ సిఖాతా ఆపస్‌మె బైర్ రఖ్‌నా
హిందీ హైఁ హమ్, వతన్ హైఁ హిందూస్తాఁ హమారా ॥

భావం : ప్రపంచంలోకెల్లా మన భారతదేశం ఉత్తమమైంది. ఇది మనకో ఉద్యానవనం. మన మిక్కడ బుల్బుల్ పిట్టలం. ఆకాశాన్నంటే ఆ మహోన్నత పర్వతం ఆపక్కన మనకు కాపలాగా రక్షణగా నిలిచివుంది. ఈ దేశమాత ఒడిలో వేలాది నదులు ఆడుకుంటున్నాయి. ఈ నదీజలాలతో వికసించిన పూదోటను చూసి స్వర్గమే అసూయపడుతున్నది. మతం పరస్పర వైరాన్ని బోధించదు. మనమంతా భారతీయులం. మనదేశం భారతదేశం.

ఉపాధ్యాయులకు సూచన :
ఈ గీతాన్ని రోజూ ప్రార్థనా సమయంలో లయబద్ధంగా పాడించాలి.






# ఝండా ఊంఛా రహే హమారా

—శ్యాంలాల్ గుప్త పార్షద్



విజయీ విశ్వ తిరంగా ప్యారా
ఝండా ఊంచా రహే హమారా
॥ ఝండా ॥

సదా శక్తి బర్సానే వాలా
ప్రేమ సుధా సర్సానే వాలా
వీరోంకో హర్షానే వాలా
మాతృ భూమికా తన్ మన్ సారా
॥ ఝండా ॥

స్వతంత్రతాకీ భీషణ రణ్ మే
లగ్‌కర్ బఢే జోష్ క్షణ్ క్షణ్ మే
కావే శత్రు దేఖ్ కర్ మన్ మే
మిట్ జావే భయ సంకట్ సారా
॥ ఝండా ॥

ఇస్ ఝండేకే నీచే నిర్భయ
లే స్వరాజ్య యహ అవిచల నిశ్చయ్
బోలో భారత్ మాతాకీ జయ్
స్వతంత్రతా హీ ధ్యేయ హమారా
॥ ఝండా ॥





ఇస్‌కీ షాన్ న జానేపావే
చాహే జాన్ భలేహి జాయె
విశ్వ విజయ కర్ కే దిఖ్ లావే
తబ్ హోవే ప్రణ పూర్ణ హమారా
॥ ఝండా ॥

**భావం :** ప్రియమైన మా త్రివర్ణ పతాకం విజయంతో విశ్వంలో ఎత్తున రెపరెపలాడుతుండుగాక ! ॥ ప్రియమైన ॥

ఎల్లప్పుడూ శక్తిని కురిపించేది, ప్రేమామృతం చిలికేది, వీరులకు హర్షదాయకమైంది. మాతృభూమి తనువుకూ, మనస్సుకూ ప్రతీకగా ఉండే విధంగా ॥ ప్రియమైన ॥

భీకర స్వాతంత్ర్య సమరంలో క్షణక్షణం శత్రువుల నెదిరించే ఉత్సాహం కలిగిస్తూ చూసినంతనే మనసుల్లో భయసంకటాలు నశించేటట్లు ॥ ప్రియమైన ॥

ఈ జెండా నీడలో నిర్భయులమై నిశ్చలులమై స్వరాజ్యం సాధించేందుకు నిశ్చయించుకొని, స్వాతంత్ర్యమే మా ధ్యేయమని భారతమాతకు జయమని నినదిస్తూ ॥ ప్రియమైన ॥

ప్రాణాలు పోయినప్పటికీ ఈ జెండా గౌరవం కాపాడుకోవాలి. విశ్వవిజయం సాధించి చూపించాలి. అప్పుడే మన ప్రతిజ్ఞ పూర్తిగా నెరవేరుతుంది. ॥ ప్రియమైన ॥

**ఉపాధ్యాయులకు సూచన :**

ఈ గేయాన్ని ప్రార్థనా సమయంలో ప్రతి రోజూ విద్యార్థులచేత లయ బద్ధంగా పాడించాలి. భావం చెప్పించాలి.

# దేశమును ప్రేమించుమన్నా !

- గురజాడ అప్పారావు



దేశమును ప్రేమించుమన్నా !
మంచి యన్నది పెంచుమన్నా !
వట్టిమాటలు కట్టి పెట్టోయ్,
గట్టిమేల్ తల పెట్టవోయ్.

పాడిపంటలు పొంగి పొర్లే
దారిలో నువు పాటు పడవోయ్,
తిండి కలిగితె కండ కలదోయ్,
కండకలవాడేను మనిషోయ్.

పూను స్పర్థను విద్యలందే,
వైరములు వాణిజ్యమందే,
వ్యర్థకలహము పెంచబోకోయ్,
కత్తి వైరం కాల్చవోయ్.

దేశాభిమానం నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్,
పూని యేదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్.

సొంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయ్,
దేశమంటే మట్టి కాదోయ్,
దేశమంటే మనుషులోయ్ .

దేశమనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్,
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్.





ఆకులందున అణగి మణగీ
కవితకోయిల పలుకవలెనోయ్,
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయ్.

ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఈ గేయాన్ని విద్యార్థులచేత పాడించాలి.
2. ఈ గేయంలోని భావాలను వివరించాలి.
3. 'దేశసేవ – మానవ సేవ' అనే భావాలను విద్యార్థులకు విశదంగా చెప్పి, వారు ఇతరులకు సాయపడేట్లు ప్రేరేపించాలి.
4. కొందరు దేశభక్తులను గురించి చెప్పి, వారిని గురించి విద్యార్థులచేత చెప్పించాలి.



# భరతమాత

— శ్రీ దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి



జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్యధాత్రి !
జయ జయ జయ శత సహస్ర
నరనారీ హృదయనేత్రి !

జయ జయ సస్యామల సు
శ్యామ చల చ్చేలాంచల !
జయ వసంత కుసుమ లతా
చలిత లలిత చూర్ణకుంతల !
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా !
జయ జయ జయ ..

జయ దిశాంత గత శకుంత
దివ్యగాన పరితోషణ !
జయ గాయక వైతాళిక
గళ విశాల పథ విహరణ !
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణా !
జయ జయ జయ ...

---

[illegible] స్తుతించే ఈ గేయం విద్యార్థులు కంఠస్థం చేసి పాడు[illegible] [illegible]తమే ఉద్దేశించబడింది.

**భావం :**

జనులందరి మనస్సులకు అధినేతవ్వూ భారతభాగ్య విధాతవ్వూ అయిన నీకు జయమగుగాక! పంజాబు, సింధు, గుజరాతు, మహారాష్ట్ర, ద్రావిడం, ఉత్కళ, వంగ దేశాలతోను, వింధ్య హిమాలయ పర్వతాలతోను, యమునా, గంగా ప్రవాహాలతో ఉప్పొంగుతూ లేచే సముద్ర తరంగాలతోను శోభించే ఓ భారత భాగ్యవిధాతా! వాటికి నీ శుభనామం ఉద్బోధ కలిగిస్తుంది. అవి నీ ఆశీస్సులు అర్థిస్తాయి. నీ జయగాథల్ని గానం చేస్తాయి. సమస్తజనులకు మంగళప్రదాతవ్వూ, భారతభాగ్య విధాతవ్వూ అయిననీకు జయమగుగాక జయమగుగాక! జయమగుగాక!

**ఒక వివరణ :**

ఈ గీతం అవిభక్త భారతదేశంలోని రాష్ట్రాలను సూచిస్తుంది. సింధుప్రాంతం ఇప్పుడు పాకిస్థాన్‌లో ఉంది. 'మరాఠా' అంటే మహారాష్ట్రం. 'ద్రావిడ' అంటే తమిళ, ఆంధ్ర, కర్ణాటక, కేరళ ప్రాంతాలు. 'ఉత్కళ' అంటే ఒరిస్సా. 'వంగ' అంటే ఇప్పటి పశ్చిమబెంగాలు.

ఉపాధ్యాయులు పిల్లలందరిచేత ఈ గీతాన్ని సుస్వరంతో పాడించాలి.



# ప్రతిజ్ఞ

భారతదేశం నా మాతృభూమి. భారతీయులందరు నా సహోదరులు.

నేను నా దేశాన్ని ప్రేమిస్తున్నాను. సుసంపన్నమైన, బహువిధమైన నా దేశ వారసత్వ సంపద నాకు గర్వకారణం. దీనికి అర్హత పొందడానికి సర్వదా నేను కృషి చేస్తాను.

నా తల్లిదండ్రుల్ని, ఉపాధ్యాయుల్ని, పెద్దలందర్ని గౌరవిస్తాను. ప్రతివారితోను మర్యాదగా నడుచుకొంటాను.

నా దేశంపట్ల, నా ప్రజలపట్ల సేవానిరతితో ఉంటానని ప్రతిజ్ఞ చేస్తున్నాను.

వారి శ్రేయోభివృద్ధులే నా ఆనందానికి మూలం.

# 1 వందనం



వందనం వందనం
– తెలుగుతల్లికి వందనం

నందనం నందనం
– తెలుగుభూమి నందనం

సుందరం సుందరం
– తెలుగుగడ్డ సుందరం

చందనం చందనం
– తెలుగునేల చందనం

సుమధురం సుమధురం
– తెలుగు భాష సుమధురం

అందరం అందరం
– తెలుగు బిడ్డలందరం

ఉండెదం ఉండెదం
– కలసి మెలసి ఉండెదం

పెంచెదం పెంచెదం
– తెలుగు కీర్తి పెంచెదం

పంచెదం పంచెదం
– తెలుగు వెలుగు పంచెదం

వందనం వందనం
– తెలుగుతల్లికి వందనం



# 2 వర్ణమాల

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ

ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం

క ఖ గ ఘ ఙ

చ ఛ జ ఝ ఞ

ట ఠ డ ఢ ణ

త థ ద ధ న

ప ఫ బ భ మ

య ర ల వ శ ష స

హ ళ ఴ క్ష

## 3 ఈ పదాలను పలుకుదాం

పునశ్చరణ

| |
|---|
| కొడుకు |
| గొడుగు |
| చెలిమి |
| జేజేలు |
| టెంకాయ |
| తడబాటు |




| |
|---|
| బీరతీగ |
| కైకేయి |
| గౌను |
| కాపురం |
| మొదలు |
| మోకాలు |



| |
|---|
| ఐదు పైసలు |
| కృషీవలుడు |
| నలమహారాజు |
| చౌక బేరం |



అభ్యాసం : ఈ అక్షరాలను గుర్తుపట్టండి

| | | | | |
|---|---|---|---|---|
| కౌ | లే | తే | తి | లి |
| యి | మి | యొ | మొ | యో |
| మో | ర | ఠ | హే | వే |
| బ | భ | బే | చే | ఒ |

పునశ్చరణ

| |
|---|
| ముఖం |
| ఘటం |
| పింఛం |
| ఝంఝ |
| కంఠం |

| |
|---|
| దృఢం |
| కథ |
| ధనికుడు |
| ఫలం |
| భగభగ |

| |
|---|
| ముఖకమలం |
| సంఘటన |
| ఝంఝామారుతం |
| ఫిరంగి గుండు |
| రథికుడు |
| బహుభారం |
| ఫాలభాగం |
| విఘాతం |





అభ్యాసం : ఈ పదాలను గమనించండి.

| |
|---|
| అణకువ |
| కణకణ |
| మనసు |
| కళకళ |
| మిలమిల |

| |
|---|
| హారతి |
| శబరి |
| సగం |
| ఉష |
| కషాయం |

# 4 కొన్ని గుణింతాలు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| ఖ | ఘ | ఛ | ఝ | ఠ | ఢ | థ | ధ | ఫ | భ |
| ఖా | ఘా | ఛా | ఝా | ఠా | ఢా | థా | ధా | ఫా | భా |
| ఖి | ఘి | ఛి | ఝి | ఠి | ఢి | థి | ధి | ఫి | భి |
| ఖీ | ఘీ | ఛీ | ఝీ | ఠీ | ఢీ | థీ | ధీ | ఫీ | భీ |
| ఖు | ఘు | ఛు | ఝు | ఠు | ఢు | థు | ధు | ఫు | భు |
| ఖూ | ఘూ | ఛూ | ఝూ | ఠూ | ఢూ | థూ | ధూ | ఫూ | భూ |
| ఖె | ఘె | ఛె | ఝె | ఠె | ఢె | థె | ధె | ఫె | భె |
| ఖే | ఘే | ఛే | ఝే | ఠే | ఢే | థే | ధే | ఫే | భే |
| ఖై | ఘై | ఛై | ఝై | ఠై | ఢై | థై | ధై | ఫై | భై |
| ఖొ | ఘొ | ఛొ | ఝొ | ఠొ | ఢొ | థొ | ధొ | ఫొ | భొ |
| ఖో | ఘో | ఛో | ఝో | ఠో | ఢో | థో | ధో | ఫో | భో |
| ఖౌ | ఘౌ | ఛౌ | ఝౌ | ఠౌ | ఢౌ | థౌ | ధౌ | ఫౌ | భౌ |
| ఖం | ఘం | ఛం | ఝం | ఠం | ఢం | థం | ధం | ఫం | భం |

## 5 ఈ పదాలనూ పలుకుదాం

| | |
|---|---|
| ఖేదం | పథకం |
| అఖిలం | రథికుడు |
| ఘీంకారం | ధీరుడు |
| ఘోటకం | ధేనువు |
| ఛురిక | ఫేరవం |
| ఛేదన | భారవి |
| ఢమ ఢమ | భీముడు |
| ఢులి | భూమి |
| | |





| |
|---|
| ధీరుని ఛురిక |
| భీముని ఖేల |
| రథికుని పథం |
| ఘంటానాదం |
| ఘోటకసమూహం |
| గజఘీంకారం |



● అభ్యాసం : అక్షరాలను గుర్తుపట్టండి

| | | | | |
|---|---|---|---|---|
| ఖై | భై | ఘు | ఘో | ఠొ |
| ఝో | ఝు | ఝూ | ఛీ | భీ |
| ఢీ | ఢీ | ధీ | ధౌ | ఠౌ |
| ఛూ | ఫా | ఫూ | భూ | ధై |

# ఈ పదాలనూ పలుకుదాం

ఖేచరం
ఖైదు
ఘాతుకం
మేఘుడు
ఘోరం
ఝుంకారం
కంఠీరవం
శాంఠి



కథకుడు
ధీమంతుడు
విధి విలాసం
వధూవరులు
ఫలరసం
చేదు కాఫీ
భైరవుడు
భౌ భౌ



ఖైదు శిక్ష
కథాకథనం
భైరవు తేజి
భౌ భౌ రవం
ఫలరసపానం



అభ్యాసం : ఖాళీలను పూరించండి

| | |
|---|---|
| 1. ఖే ____ రం | 5. మే ____ డు |
| 2. ____ ముడు | 6. చేదు కా ____ |
| 3. ఘా ____ కం | 7. కం ____ రవం |
| 4. క ____ కుడు | 8. భౌ ____ |



# 6

## ఒత్తుల పదాలు



క  ్క  త  ్త

| | | | |
|---|---|---|---|
| కుక్క | తక్కెడ | గిత్త | ఉత్తరం |
| అక్క | మక్కువ | కత్తి | తత్తరం |
| లక్క | చక్కెర | అత్త | కత్తెర |
| చెక్క | చిక్కని | ఎత్తు | చిత్తుకాగితం |

చెక్కముక్క — కొత్తగిత్త

అక్కముక్కు — అత్తపెత్తనం

టక్కరి తక్కెడ

* * * * *

అభ్యాసం : ఖాళీలను పూరించండి.

1. కు ____ తోక
2. చి ____ ని పాలు
3. [illegible] ____ మాట [illegible]
4. చ ____ ర
5. [illegible] రి న ____
6. [illegible] పె ____ నం





| | |
|---|---|
| న ్న | మ ్మ |

వెన్న కన్నీరు

కన్ను వెన్నెల

అన్న మా చిన్ని

పిన్ని జొన్న చేను

వెన్నెలలో చిన్ని ఆట

జొన్నచేలో పిన్నిపాట

అమ్మ రమ్మను

అమ్ము తిమ్మిరి

దిమ్మె తెమ్మెర

జమ్మి గుమ్మటం

అమ్మను రమ్మను

జమ్మిమీద అమ్ముల మూట

అన్నవేసిన అమ్ము అదిగో

అభ్యాసం : ఈ అక్షరాలతో ఖాళీలను పూరించండి.

మ్మ, న్నె, న్న, మ్ము, మ్మ, న్ని

1. వె ___ దొంగ
2. వెండి గి___
3. ప ___ టి ధార
4. అ___ కమ్మ
5. బొ ___ ల కొలువు
6. లె ___ లెమ్ము





| యు ్య | ర ్ర |
|---|---|

చెయ్యి ఉయ్యాల
రొయ్య కయ్యాలు
అయ్య సయ్యాట
నుయ్యి వియ్యాలవారు

కర్ర బుర్రమీసం
మర్రి కర్రిఆవు
చుర్రు నీటి బుర్ర
పుర్రె చిర్రుబుర్రు

వియ్యాలవారితో కయ్యాలేల
ముందు నుయ్యి వెనుక గొయ్యి

చిర్రుబుర్రులాడకు
కర్రకు వేలాడే నీటిబుర్ర

అయ్య మేపే కర్రి ఆవు

* * * * *

అభ్యాసం : ఈ ఖాళీలను పూరించండి.

1. గు___పు రౌతు
2. మ___పీడ
3. చు___మని కాలింది
4. వె___ రూపాయలు
5. లోతు ___య్యి
6. పిట్ట తు___మన్నది





| ల | ౢ | వ | ్వ |
|---|---|---|---|

బల్లి అల్లరి అవ్వ దువ్వెన

చెల్లి జల్లెడ తవ్వ జవ్వనం

ఉల్లి జిల్లేడు దవ్వు కవ్వపు గుత్తి

మల్లె హరివిల్లు జువ్వి పాలబువ్వ

చెల్లి జడలో మల్లెదండ అవ్వచేతిలో కవ్వం

పల్లెలో వానజల్లు నువ్వు పువ్వు

చెల్లి నోటిలో పాలబువ్వ

* * * *

అభ్యాసం : అక్షరాలను సరయిన వరుసలో ఉంచండి.

1. జడల్లె
2. పాబువ్వల
3. రిల్లఅ
4. కపువ్వత్తిగు
5. ల్లెమపువ్వు
6. ల్లువవె

## 7 ఈ మాటలు పలుకుదాం

1. చెకుముకి
2. వెక్కి వెక్కి
3. అతగాడు
4. అత్తగారు
5. మనం
6. కన్నం
7. కమల
8. కమ్మలు
9. భయం
10. [illegible]
11. చురచుర
12. జర్రుజర్రు
13. కల
14. కల్ల
15. పూవు
16. పువ్వు

* * * *

అభ్యాసం : కింది ఖాళీలను పూరించండి.

1. అ__గారు
2. చి__డి వేలు
3. టక్కరి న__
4. సు__పు గోడ
5. అ__గాడు
6. కొ__పీట
7. జర్రు జ_
8. ఆ__రి పిల్ల
9. దు__న
10. చె__ని రూపాయ
11. ఆకూ, సు__ం
12. చె__ముక్క



| గ | ్గ |
|---|---|

| చ | ్చ |
|---|---|

మొగ్గ    మగ్గాలు

బుగ్గి    పగ్గాలు

బుగ్గ    ఉగ్గుపాలు

మొగ్గు    లేత బుగ్గ

అగ్గిమీద గుగ్గిలం

పాలబుగ్గల నిగ్గులు

మచ్చ    పిచ్చుక

గిచ్చు    మచ్చిక

లచ్చి    నిచ్చెన

పచ్చి    పిచ్చివాడు

పచ్చపచ్చని పచ్చిక

నిచ్చెనపై పిచ్చుక

పాప బుగ్గమీద నల్లమచ్చ

*    *    *    *

అభ్యాసం : ఈ అక్షరాలను సరయిన వరుసలో ఉంచండి.

1. గ్గిఅ
2. అముగ్గ
3. గ్గముప
4. గ్గుర
5. గ్గుజ
6. యచ్చప
7. పొడుగునిచ్చెన
8. డువాచ్చిపి
9. గ్గబుపై చ్చమ
10. చ్చిలగమడు





ట ట    డ డ

కట్ట పట్టెడు    బిడ్డ గొడ్డలి
మట్టి చుట్టాలు    వడ్డి బుడ్డి
కట్టు మట్టెలు    లడ్డు అడ్డదారి
చెట్టు మంకుపట్టు    చెడ్డ వరిగడ్డి

చెట్టు చుట్టు మట్టికట్ట    బిడ్డనోట పాలబుడ్డ
వట్టిమాటలు కట్టిపెట్టు    అడ్డదారిన పడ్డవారు

చెడ్డపసులకు అడ్డుకట్ట

*    *    *    *    *

అభ్యాసం : ఖాళీలను పూరించండి.

1. గాజులూ మ___లు    4. మంచీ చె___
2. కట్టూ బొ___    5. బి___పాప
3. చె___చేమా    6. చు___లు పక్కాలు





| ద | ్ద | ప | ్ప |
|---|---|---|---|
| ముద్ద | పొద్దుట | కప్ప | అప్పడం |
| ఎద్దు | అద్దరి | ఉప్పు | చప్పన |
| చద్ది | మద్దెల | డప్పు | ఉప్పెన |
| రద్దీ | వద్దు వద్దు | కప్పు | ఇంటి కప్పు |

చద్ది ముద్ద పొద్దుటి పూట
పెద్ద రద్దీలో తిరగవద్దు

ఉప్పులేని కూర చప్పన
తెప్పమీద కప్పకూత

గంగిరెద్దు ఆట – కమ్మని సన్నాయి పాట

అభ్యాసం : ఖాళీలను పూరించండి.

1. చ____మూట
2. రుచికి ఉ____
3. క____ కాఫీ
4. కాలు చె____
5. దుక్కిటె____
6. పొ____టి పూట
7. వెదురు బ____
8. పె____మనిషి



బ ్బ

జబ్బు కబ్బము
గొబ్బి అబ్బురము
రుబ్బు తబ్బిబ్బు
మబ్బు నిబ్బరము
మబ్బులలో అబ్బురపు మెరుపు
కబ్బములో గొబ్బిపాట



స ్స

హైలెస్సు ఉస్సురు
డస్సి శిరస్సు
లెస్స ఉషస్సు
ధనుస్సు కస్సుబుస్సు
డస్సిపోయి ఉస్సురనెను
కస్సుబుస్సులాడకు

మబ్బులలో ఇంద్రధనుస్సు

* * * * *

అభ్యాసం : ఈ కింది ఖాళీలను పూరించండి.

1. ర___రు బంతి
2. డ___ లేనివాడు
3. రు___రోలు
4. క___ము రాసినకవి
5. ఇంద్ర ధను___
6. బ___ ప్రయాణం
7. పాలపాడి ___
8. శిర___ అంటే తల






ళ ళ



జ జ

ఒళ్ళు రెండుకళ్ళు
గొళ్ళెం హారతి పళ్ళెం
పెళ్ళి చెళ్ళపిళ్ళ

సజ్జ మజ్జిగ
గుజ్జు చిరుబొజ్జ
బెజ్జం బుజ్జిపాప
బుజ్జి సూదిబెజ్జం

అక్కపెళ్ళికి హారతిపళ్ళెం

మహాకవి చెళ్ళపిళ్ళ

బుజ్జిపాపకు గజ్జెలు

చిరుబొజ్జకు పెరుగుగుజ్జు

బుజ్జిపాప చేతిలో హారతి పళ్ళెం

* * * * *

అభ్యాసం : ఈ ఖాళీలను పూరించండి.

1. అక్క పె___
2. క___ల్లో కారం
3. తలుపు గొ___ం
4. బు___పాపాయి
5. చిరు గ___లు
6. స___చేను





| ఞ | ్ఞ |
|---|---|
| యజ్ఞము | |
| ఆజ్ఞ | |
| జ్ఞానము | |
| అజ్ఞాతం | |
| ప్రజ్ఞ | |
| విజ్ఞత | |






# 8 మా బడి

ఇదిగో మా బడి
నేర్పును మాకిది
చక్కని నడవడి



పిన్నలకూ మరి
పెద్దలకూ ఇది
చూపును ఒరవడి



ఆటల పాటల
చదువుల బాటలు
వేయును మా బడి

తేనె మనసులకు
తేట బుద్ధులకు
ఇది చల్లని బడి



నీతి నియమములు
శాంతి సహనములు
మొలకెత్తే మడి

జ్ఞానతేజమే
దివ్యమూర్తియై
వెలసిన ఒక గుడి

ఉపాధ్యాయులకు సూచనలు :-

'బడి' ప్రాముఖ్యం విద్యార్థులకు వివరిస్తూ బడిలో జరిగే కార్యక్రమాలను గురించి తెలుపుతూ బడికి – గుడికీ గల సామ్యాన్ని తేటమాటలలో వివరించాలి. వడవడి, ఒరవడి, మడి, గుడి అనుపదాలను బడికి అనువర్తింపజేసి బోధించాలి.



# 9 ఒక హల్లుతో మరో హల్లు చేరే పదాలు

| | | |
|---|---|---|
| శక్తి | | కష్టం |
| కర్పూరం | | ప్రయత్నం |
| భద్రాచలం | | ముత్యం |
| ఖర్చు | | శబ్దం |
| పార్వతి | | పద్మం |
| అర్భకుడు | | సంవత్సరం |
| నిశ్చలం | | వాస్తవం |
| కర్కశం | | దుర్బలుడు |
| దుర్లభం | | సుగ్రీవుడు |
| కవిత్వం | | స్వర్గం |



**అభ్యాసం : ఈ అక్షరాలను పలకండి.**

క్ల, ట్ర, వ్య, ల్క, క్ష, ష్మ

ఈ అక్షరాలతో కింది ఖాళీలను పూరించండి.

1. నగ, న___
2. ___యం
3. వా___



4. గ్రీ___ఋతువు
5. ఉ___
6. శు___పక్షం

# హల్లుతో మరో హల్లు చేరే మరికొన్ని

## పదాలు

| | |
|---|---|
| మూర్ఖుడు | నిర్మలం |
| దుర్ఘటన | వర్షం |
| ఖర్జూరం | కల్హారం |
| ఆజ్ఞ | కృష్ణానది |
| పర్ణశాల | పోస్టుకార్డు |
| అర్థం | మార్దవం |
| బుద్ధి | కద్రువ |

* * * * *

**అభ్యాసం : ఈ పదాలను చదివి తిరిగి రాయండి.**

1. కర్ణము 2. కర్జము 3. కర్షకుడు
4. నిష్కర్ష 5. పేట్రేగు 6. తాండ్రపాపయ్య
7. నిర్జలము 8. నిర్ధనుడు 9. వాక్చాతుర్యం
10. భీష్ముడు

# 10 హల్లులు – ఒత్తులు

| | | | |
|---|---|---|---|
| క | ్క | ద | ్ద |
| ఖ | ్ఖ | ధ | ్ధ |
| గ | ్గ | న | ్న |
| ఘ | ్ఘ | ప | ్ప |
| ఙ | ్ఙ | ఫ | ్ఫ |
| చ | ్చ | బ | ్బ |
| ఛ | ్ఛ | భ | ్భ |
| జ | ్జ | మ | ్మ |
| ఝ | ్ఝ | య | ్య |
| ఞ | ్ఞ | ర | ్ర |
| ట | ్ట | ల | ్ల |
| ఠ | ్ఠ | ళ | ్ళ |
| డ | ్డ | వ | ్వ |
| ఢ | ్ఢ | శ | ్శ |
| ణ | ్ణ | స | ్స |
| త | ్త | ష | ్ష |
| థ | ్థ | హ | ్హ |





# 11

## ఒక హల్లు - రెండు ఒత్తులు

| | |
|---|---|
| రాష్ట్రపతి | అర్ఘ్యం |
| లక్ష్మయ్య | జ్యోత్స్న |
| స్త్రీ | ధృతరాష్ట్రుడు |
| వస్త్రం | వైశిష్ట్యం |
| స్వాతంత్ర్యం | ఇన్స్పెక్టరు |

అభ్యాసం : కింది పదాలు పూర్ణానుస్వారంతో కూడినవి. అయితే పలకటంలో ఉన్న తేడాను, మాటలను పలుకుతూ గమనించండి.

1. కంప   2. కాంతి   3. గంట

4. బండ   5. పెంకు   6. రంగు

ఈ పదాలను ఇలా రాసి పలుకుదాం.

1. కమ్పనము   2. కాన్తి   3. దన్తము

వీటిని పలకడంలో కొంచెం తేడాలున్నా రాతలో మొదటి అక్షరానికి సున్నా చేర్చి రాస్తాం.

# 12 రింగు రింగు బిళ్ళ (పాట)

రింగు రింగు బిళ్ళ - రూపాయదండ
దండకాదురా - తామర మొగ్గ
మొగ్గకాదురా - మోదుగు పీడ
పీడకాదురా - నిమ్మల బావి
బావికాదురా - బచ్చల కూర
కూరకాదురా - కుమ్మరి మెట్టు
మెట్టు కాదురా - మేదర సిబ్బి
సిబ్బికాదురా - చీపురుకట్ట
కట్టకాదురా - కావిడిబద్ద
బద్దకాదురా - బారెడు మీసం
మీసం కాదురా - మిరియాల పొడుం
పొడుంకాదురా - పోతురాజు



అభ్యాసం : ఈ పదాలను గమనించండి.

1. బిళ్ళ 2. మొగ్గ 3. నిమ్మల 4. బచ్చల 5. కుమ్మరి
6. మెట్టు 7. సిబ్బి 8. కట్ట 9. బద్ద

ఈ పదాలను పలుకుతూ మళ్ళీ రాయండి.

సంతోషమే సగం బలం

## 13 ప్రాస వాక్యాలు



1. చదువులేని మొద్దు
   కదలలేని ఎద్దు
2. అడుసు తొక్కనేల
   కాలు కడుగనేల
3. కట్టులేని నోరు
   కట్ట తెగిన యేరు
4. మాట తప్పబోకు
   మంచి విడువబోకు
5. పెద్దవాళ్ళ మాట
   పెరుగన్నం మూట
6. కలిమిలేని వాడు
   బలిమిలేని వాడు
7. అరువు చేయబోకు
   ఆడి తప్పబోకు
8. నీతి తోడమెలగు
   నీకె మేలు కలుగు

# 14 దిక్కులు – మూలలు



సూర్యుడు తూర్పున ఉదయిస్తాడు. పడమట అస్తమిస్తాడు. మన దేశానికి ఉత్తరాన హిమాలయ పర్వతాలు ఉన్నాయి దక్షిణాన హిందూ మహాసముద్రం ఉన్నది. సింహళదేశం ందూ మహాసముద్రంలో ఒక దీవి. బంగాళాఖాతం మన దేశానికి ార్పున ఉన్నది. పడమట అరేబియా సముద్రం ఉంది. పడమటి క లలో గోదావరి నది పుట్టింది: అది తూర్పు కనుమల గు ప్రవహించి బంగాళాఖాతంలో కలుస్తున్నది.




**ఉపాధ్యాయులకు సూచనలు :-**

1. విద్యార్థులచేత వారి వారి ఇండ్లకు గల దిక్కులను చెప్పించాలి.
2. విద్యార్థిని నిలబెట్టి చేతితో దిక్కులను, మూలలను చూపమని అడగాలి.

సత్యం పలుకుము

# 15 సూర్యుడు – చంద్రుడు







మీరు ఉదయించే సూర్యుణ్ణి చూచారు గదూ ! అరుణ కిరణాలతో ఉదయవేళ తూర్పు దిక్కున మెల్లమెల్లగా పైకి లేస్తూ సూర్యుడు చూడటానికి ఎంతో అందంగా ఉంటాడు. సాయంకాలం సూర్యుడెక్కడ కనిపిస్తాడు ? పడమటి దిక్కున అస్తమిస్తూ కనిపిస్తాడు. అప్పుడు కూడా సూర్యబింబం చూడటానికి చాలా అందంగా ఉంటుంది. ఉదయం నుండి సాయంకాలందాకా సూర్యుడేంచేస్తాడు ? తూర్పు దిక్కునుండి మెల్లమెల్లగా పయనించి సాయంకాలానికి పడమటి దిక్కుకు చేరుకుంటాడు. సూర్యుడు మనకు వెలుతురును, ఎండను ఇస్తాడు. సూర్యుడు లేకపోతే ప్రపంచమంతా చీకటిగా ఉంటుంది కదూ ! లోకంలోని జీవరాసులు, పశువులు, పక్షులు, చెట్లు చేమలు అన్నీ సూర్యుని వెలుతురువల్ల, ఎండవల్ల బతకగలుగుతున్నాయి. సూర్యుని కిరణాలు సముద్రంపై బడి అక్కడి నీటిని ఆవిరిగా మారుస్తాయి. ఆ నీటిఆవిరి మేఘాలుగా ఏర్పడి వాటినుండి వర్షం కురుస్తుంది. దానివల్ల పంటలు పండుతాయి. ఆహారం లభిస్తుంది. మన బొజ్జలు నిండుతాయి. సుఖంగా ఉంటాం.



సుఖంగా, సంతోషంగా ఉన్నప్పుడు మనం ఆడుతాం, పాడుతాం. చల్లని వెన్నెలలో తాతయ్య, అమ్మమ్మ కథలు చెబుతుంటే హాయిగా వింటాం. అమ్మ చందమామను చూపిస్తూ పాటపాడుతూ పాపకు అన్నం పెడుతుంది. చుక్కల మధ్య చంద్రుడు ' రాజులా ' ఉంటాడు. అందుకే చంద్రుణ్ణి ' రేరాజు ' అంటారు.

రాత్రిపూట మనకు చంద్రుడు కాంతిని ఇస్తాడు. దీన్ని వెన్నెల అంటాం. పున్నమనాటి రాత్రి చంద్రుడు గుండ్రంగా, నిండుగా ఉంటాడు. రాత్రంతా పండు వెన్నెల ఉంటుంది. ఇప్పుడు తెలిసిందా ? లోకానికి వెలుగు-వెన్నెలను ఇచ్చే వారెవరో ? సూర్యుడు ; చంద్రుడు.

## అభ్యాసవేదిక

కఠినపదాలు :

అరుణకిరణాలు = ఎర్రటి కిరణాలు

ఉదయించటం = పుట్టటం

అస్తమించటం = కుంగిపోవటం

మేఘాలు = మబ్బులు

వర్షం = వాన

బొజ్జలు = కడుపులు

ప్రశ్నలు :

1. సూర్యుడు ఏ దిక్కున ఉదయిస్తాడు ?
2. సూర్యుడు ఏ దిక్కున అస్తమిస్తాడు ?
3. సూర్యునివల్ల మనకు ఏం లాభం కలుగుతుంది ?
4. వెన్నెల అంటే ఏమిటి ?
5. పున్నమనాడు చంద్రుడెలా ఉంటాడు ?

ఖాళీలను పూరించండి :

1. సూర్యబింబం చూడటానికి చాలా ______ ఉంటుంది.
2. సూర్యుడు మనకు ______ ______ఇస్తాడు.
3. మేఘాలనుండి ______ కురుస్తుంది.
4. చుక్కల మధ్య చంద్రుడు ______ ఉంటాడు.

జతపరచండి :

| | | |
|---|---|---|
| సూర్యునివల్ల | - | అన్నం |
| చంద్రునివల్ల | - | ఎండ |
| మేఘాలవల్ల | - | వెన్నెల |
| అమ్మపెడుతుంది | - | వర్షం |

'అరుణకిరణాలు ' అను పదం నుండి అయిదు గొలుసుకట్టు పదాలను తయారుచేయండి.

**ఉపాధ్యాయులకు సూచనలు :**

పున్నమి - పౌర్ణమి అనే మాటల్ని వివరించాలి. ' రేరాజు ' అనే పదానికి వివరణ ఇవ్వాలి.

' చందమామ రావే ' అనే పాటను అభినయంతో పాడించాలి.

' వెలుగు - వెన్నెల ' అనే పదాల భేదాన్ని వివరించాలి.

**విద్యార్థిచేత చేయించవలసిన పనులకు సూచనలు :**

1. పిల్లలచే సూర్యుని బొమ్మ చంద్రుని బొమ్మ వేయించాలి.
2. ఉదయించే సూర్యుణ్ణి అస్తమించే సూర్యుణ్ణి గమనించేటట్లు చేయాలి.
3. పిల్లలచే సూర్యచంద్ర బింబాలుగా అట్టలను ముఖానికి తగిలించుకొని కొంత సంభాషణ చేయించవచ్చును.
4. పిల్లలను రెండు గ్రూపులుగా చేసి, ఒక గ్రూపుచేత సూర్యుని గురించి, రెండవ గ్రూపుచేత చంద్రుని గురించి రెండు మూడు వాక్యాలు రాయించవచ్చును.

# 16 బుజ్జిమేక (పాట)

(కంఠస్థం చేయాల్సిన పాట)

బుజ్జిమేక, బుజ్జిమేక ఏడకెళ్తివి ?
రాజుగారి దొడ్డిలోన మేతకెళ్తిని
రాజుగారి దొడ్డిలోన ఏమి చూస్తివి?
రాణిగారి పూలచెట్ల సొగసు చూస్తిని.

పూలచెట్లు చూసి నీవు ఊరకుంటివా ?
ఊరకొనక పూలచెట్లు మేసి వస్తిని
మేసి వస్తె నిన్ను భటులు ఏమిచేసిరి ?
భటులు వచ్చి నాదుకాలు విరుగగొట్టిరి.

ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఇద్దరు విద్యార్థులచే ఈ గేయాన్ని అభినయం చేయించాలి.
2. కొన్ని పూలచెట్ల పేర్లను పిల్లలచే చెప్పించాలి.
3. ఈ గేయంలోని నీతిని పిల్లలచే చెప్పించాలి.









# 17 తెలుగు నెలలు

| | | |
|---|---|---|
| చైత్రం | శ్రావణం | మార్గశిరం |
| వైశాఖం | భాద్రపదం | పుష్యం |
| జ్యేష్ఠం | ఆశ్వయుజం | మాఘం |
| ఆషాఢం | కార్తీకం | ఫాల్గుణం |

## తిథులు

నెలకు రెండు పక్షాలు
శుక్లపక్షం – కృష్ణపక్షం
పక్షానికి 15 దినాలు
వాటిని తిథులు అంటారు.

పౌర్ణమికి ముందరి 15 తిథులు శుక్లపక్షం
అమావాస్యకు ముందరి 15 తిథులు కృష్ణపక్షం

| శుక్లపక్షం | | కృష్ణపక్షం |
|---|---|---|
| | పాడ్యమి | |
| | విదియ | |
| | తదియ | |
| | చవితి | |
| | పంచమి | |
| | షష్ఠి | |
| | సప్తమి | |
| | అష్టమి | |
| | నవమి | |
| | దశమి | |
| | ఏకాదశి | |
| | ద్వాదశి | |
| | త్రయోదశి | |
| | చతుర్దశి | |
| పౌర్ణమి | | అమావాస్య |





## 18 ఉగాది



మనం భారతీయులం. మనదేశంలో హిందువులు, మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలగు మతాలవారున్నారు. మనం ఉగాది, దసరా, దీపావళి, సంక్రాంతి, ఈద్, క్రిస్టమస్ పండుగలను జరుపుకుంటాం. పండుగ సమయాలలో కొత్తబట్టలను ధరించి, పిండివంటలు చేసికొని బంధువులతో, మిత్రులతో ఆనందంగా ఉంటాం.

హిందువుల పండుగలలో ' ఉగాది ' ముఖ్యమైనది. దీనినే సంవత్సరాది అని కూడ అంటారు. ఇది తెలుగు సంవత్సరానికి మొదటి రోజున వస్తుంది. తెలుగు సంవత్సరాలలో ' ప్రభవ ' మొదలుకొని ' అక్షయ ' వరకు అరవై సంవత్సరాలు.

ఉగాది పండుగరోజు వేకువనే లేచి తలంటు స్నానం చేసి పిన్నలు పెద్దలు కొత్తబట్టలు ధరిస్తారు. ఉగాది పచ్చడి చేసుకొని తింటారు. రకరకాల పిండి వంటలు చేసుకొంటారు. ద్వారాలను పచ్చని మామిడాకులతో అలంకరించుకొంటారు. సాయంకాలం దేవాలయాలకు వెళ్ళి దైవదర్శనం చేసుకొని పంచాంగ శ్రవణం చేస్తారు. పంచాంగ పఠనంలో ఆ సంవత్సరంలో జరుగబోయే విషయాలను గురించిన వివరణ ఉంటుంది. ఆ రోజు ప్రజలు ఆటపాటలతో, పురాణ కాలక్షేపంతో సంతోషంగా గడుపుతారు.



## అభ్యాసవేదిక

కఠినపదాలు :

బంధువులు = చుట్టాలు; మిత్రులు = స్నేహితులు; ఆనందంగా = సంతోషంగా; సంవత్సరాది = సంవత్సరానికి మొదటిరోజు; వేకువనే = తెల్లవారువేళనే, తెల్లవారు జామువనే; పిన్నలు = చిన్నవారు; ద్వారం = దర్వాజ, గుమ్మం, వాకిలి; దేవాలయము = దేవునిగుడి; సాయంకాలం = సూర్యుడు అస్తమించే సమయం; దైవదర్శనం = దేవుని చూచుట; శ్రవణం = వినుట.

ప్రశ్నలు :

1. మనమెవరము ?
2. మీకు తెలిసిన కొన్ని మతాల పేర్లు చెప్పండి.
3. మనం జరుపుకునే కొన్ని పండుగల పేర్లు చెప్పండి.
4. పండుగలను మనమెలా జరుపుకుంటాం ?
5. ఉగాది పండుగకు మరొక పేరేమి ?
6. తెలుగు సంవత్సరాలెన్ని ?
7. ఉగాది పండుగ రోజున మనమేం చేస్తాం ?
8. పంచాంగ శ్రవణం ఎందుకు చేస్తారు ?

జతపరచండి :

| | | |
|---|---|---|
| హిందువులు | - | మామిడాకు తోరణాలు |
| మహమ్మదీయులు | - | క్రిస్టమస్ |
| క్రైస్తవులు | - | సంవత్సరాది |
| ద్వారాలు | - | సంక్రాంతి పండగ |
| ఉగాది | - | ఈద్ |





**ఖాళీలను పూరించండి :**

1. హిందువుల పండుగలలో ఉగాది ________
2. పండుగ సమయాలలో ________ ఉంటాం
3. ' ప్రభవ ' మొదలుకొని ' అక్షయ ' వరకు సంవత్సరాలు________
4. దేవాలయానికి వెళ్ళి ________ చేసికొంటాం.
5. ఉగాదిరోజు ________ శ్రవణం చేస్తారు.



**ఉపాధ్యాయులకు సూచనలు :**

' ఉగాది పచ్చడి ' : వేపపువ్వు, చింతపండు, బెల్లం, ఉప్పు , మామిడి ముక్కలు, కొబ్బరితురుము, కలిసిన పచ్చడి ప్రాముఖ్యం వివరించాలి. దీనిని వివిధ ప్రాంతాలలో చేసుకొనే పద్ధతికూడా వివరించాలి.

ఉగాది పండుగ రోజున చేసుకొనే పిండివంటలలో ' భక్ష్యాలు, పోలెలు' మొదలైన వాటిని గురించి చెప్పవచ్చు.

పండుగలను - దేవాలయాలను గూర్చి వివరించి - మతములు అన్నీ సమానమే అనే భావన కలిగించాలి.

60 తెలుగు సంవత్సరాలను పరిచయం చేసి, వీలైనన్నిసార్లు చెప్పించాలి.

జాతీయమైన పండుగలను గూర్చి కూడా తెలియజేయాలి.

**విద్యార్థి కృత్యాలకు సూచనలు :**

1. వివిధ ప్రార్థనాలయాలను దర్శింపజేయడం.
2. దేవాలయాల బొమ్మలు గీయించడం.
3. పండుగలలో వారి వారి అనుభవాలను చెప్పించడం.
4. పిల్లలను జట్లుగా చేసి ఒక్కొక్క జట్టుచే ఏదైనా ఒక పండుగను గురించి చిన్న చిన్న వాక్యాలలో రాయించడం.

# 19 దేవుని దీవెనలు



గల గల గల గల నవ్వడితో
కిల కిల కిల కిల నవ్వులతో
గబ గబ గబ గబ పోయాము
బిర బిర బిర బిర నడిచాము
డమ డమ డమ డమ డమరువు మొరసెను
సుడి వడి వడి వడి గాలులు విసరెను
పెళ పెళ పెళ పెళ ఉరుములు ఉరిమెను
తళ తళ తళ తళ మెరుపులు మెరసెను
చిట పట చిట పట చినుకులు కురిసెను
జల జల జల జల ఏరులు పారెను



గుమ గుమ గుమ గుమ పూవులు విరిసెను
వడి వడి వడి వడి పూలు కోసికొని
చక చక చక చక మాల గట్టుకొని
బిల బిల బిల బిల గుడికి వెళ్ళితిమి
దేవుని మెడలో దండలు వేసి
దీవెన లిమ్మని మొక్కితిమి







# 20 మా ఇల్లు



మా ఇల్లు అంటే నాకు ఎంతో ఇష్టం. మా ఇంటిలో మా నాన్న, మా అమ్మ, నేను, మా చెల్లి ఉంటాం. మా అమ్మ మమ్మల్ని ఎంతో ముద్దుగా చూసుకొంటుంది. మేము తినేందుకు మా నాన్న పళ్లు తెస్తారు. మా చెల్లి, నేనూ కావలసినన్ని పళ్లు తింటాం.

మా ఇంటి పక్కనే బావి ఉన్నది. మా నాన్న మొక్కలకూ, పాదులకూ బావినీళ్లు తోడిపోస్తారు. అవి చిగుళ్లు వేసి పూలు పూస్తాయి. మా పెరటిలో బెండకాయలు, వంకాయలు, చిక్కుడుకాయలు

బోలెడన్ని కాస్తాయి. తోటకూర, బచ్చలకూర మళ్ళు కూడా పెంచుతాం. మా అమ్మ అన్ని మొక్కలనూ, పాదులనూ చక్కగా చూసుకొంటుంది. మా పెరటిలోని మొక్కజొన్న కంకులు ఎంతో రుచి. మా ఇంటి ముందు వేపచెట్టు కింద చల్లగా ఉంటుంది.

మా పాడి ఆవు ఆ చెట్టు కిందనే పడుకొంటుంది. దాని లేగ చెంగు చెంగున గంతులేస్తూ ఉంటుంది. ఆ లేగ నాకూ, మా చెల్లికీ చాలా ఇష్టం.

* * * * *

సరయిన సమాధానం ఎన్నుకోండి :

1. ఈ ఇంటిలో ఎంతమంది ఉన్నారు ?
   1. ఇద్దరు   2. [illegible]రు   3. పదిమంది
   4. ఒక్కరు ( )
2. మొక్కలకు వారు పోసే నీరు
   1. చెరువునీరు   2. నదిలోనీరు
   3. బావినీరు   4. పంపునీరు ( )
3. వీటిలో ఆకుకూర ఏది ?
   1. వంకాయ   2. చిక్కుడు
   3. కేరట్   4. తోటకూర ( )
4. వారి ఇంటిముందు ఉన్న చెట్టు ఏది ?
   1. వేపచెట్టు   2. టేకుచెట్టు
   3. మామిడిచెట్టు   4. రావిచెట్టు ( )
5. లేగతో చెట్టు కింద ఉన్నది.
   1. మేక   2. కోడి   3. కుక్క   4. ఆవు ( )

## 21 ఉపకారం (గేయకథ)






చెరువుగట్టు చెట్టుమీద
చిట్టి పొట్టి పిట్ట ఉన్నది
గాలికొక్క గండుచీమ
కాళ్ళు జారి నీళ్ళబడ్డది
అయ్యొ పాపమనుచు పిట్ట
ఆకురాల్చి పాకమన్నది
అలలవెంట గట్టు చేరి
అపుడు చీమ బయటపడ్డది
చెట్టుమీది పిట్టమీద
ఒక్కబోయ కన్ను పడ్డది
పుట్టమీద నిలిచి వాడు
విల్లుపట్టి అమ్ము తొడిగి,
గురిని చూచి కొట్టబోవ
సరిగ చీమ కంటబడ్డది
బోయకాలు కరచి చీమ
పుట్టలోకి జారుకొన్నది
'అబ్బా' అని వాడరవగ
అపుడు పిట్ట తుర్రుమన్నది

— కస్తూరి నరసింహమూర్తి

ఉపాధ్యాయులకు సూచనలు :

1. ఈ గేయంలోని నీతిని విద్యార్థులచేత చెప్పించాలి.
2. ఈ గేయకథను విద్యార్థుల సొంత మాటలలో చెప్పించాలి.
3. ఇలాంటి గేయకథల్ని సేకరించి విద్యార్థులకు బోధించాలి.
4. బొమ్మల్ని చూచి కథను చెప్పించాలి.



## 22 మంచి అలవాట్లు

నేను పెందలకడనే నిద్ర లేస్తాను. వేపపుల్లతో కాని, పళ్లపొడితో కాని, బ్రష్షుతో కాని పండ్లు శుభ్రంగా తోముకుంటాను. ప్రతిరోజూ స్నానం చేస్తాను. సబ్బుతో ఒళ్ళు తోముకుంటాను. అప్పుడప్పుడు కుంకుడు కాయల పొడితో కాని, షాంపూతో కాని తలస్నానం చేస్తాను. రోజూ ఉతికిన బట్టలు తొడుక్కుంటాను. పరిశుభ్రమైన మంచి నీళ్ళే తాగుతాను. మురికి నీళ్ళు తాగితే జ్వరం వస్తుంది.





గోళ్ళను కొరకటం చెడ్డ అలవాటు. గోళ్ళను పెరగకుండా కత్తిరించుకోవాలి. బజారులో నడిచేటప్పుడు నేను చెప్పులు తొడుక్కొని వెళతాను.

నేను అన్నంలో పప్పు, కాయగూరలు, ఆకుకూరలు, పెరుగు వేసుకొని తింటాను. గుడ్లు కూడా మంచి ఆహారమని మా అమ్మ చెప్పింది.

ప్రతిరోజూ పాలు తాగితే మంచిదని మా నాన్న చెప్పారు. మారాం చేయకుండా మీరూ ఇవి తీసుకోవాలి.

పెందలాడే నిద్రపోయి, ఉదయాన్నే లేవాలి. అందరూ అలానే చేయండి !



## అభ్యాసం :

### ప్రశ్నలు

1. వారానికొక్కసారి స్నానం చెయ్యవచ్చునా ?
2. మురికినీళ్ళు తాగవచ్చునా ?
3. అన్నంతో ఏమేమి తింటారు ?

**క్రింది వాక్యాలు 'తప్పు' లేదా 'ఒప్పు' అని సూచించండి :**

1. రోజూ స్నానం చేయాలి ( )
2. గోళ్ళు పొడుగ్గా పెంచుకోవాలి ( )
3. మంచి నీరే తాగాలి ( )
4. గోళ్ళు కత్తిరించుకోవాలి ( )
5. అన్నం తినేముందు చేతులు కడుక్కోవాలి ( )
6. అన్నం తిన్న తరవాత నోరు బాగా పుక్కిలించాలి ( )
7. ఇంటిని శుభ్రంగా ఉంచవద్దు ( )
8. తరగతి గదిలో చిత్తు కాగితాలు వేయాలి ( )



# 23 చిలకమ్మ పెళ్ళి (పాట)





చిలకమ్మ పెండ్లియని – చెలికత్తెలందరును
చెట్లు సింగారించి – చేరికూర్చున్నారు
పందిట పిచుకలు – సందడి చేయగ
కాకుల మూకలు బాకాలూదగ
కప్పలు బెక బెక డప్పులు కొట్టగ
కొక్కొరొకోయని కోడికూయగ
ఝుమ్మని తుమ్మెద తంబుర మీటగ
కుహూ కుహూయని – కోయిల పాడగ
పిల్ల తుమ్మెదలు వేణువూదగా
నెమలి సొగసుగా నృత్యము సేయగ
సాలీడిచ్చిన చాపు కట్టుకొని
పెండ్లి కుమారుడు బింకము చూపగ
మల్లిక మాలతి మాధవీలతలు
పెండ్లి కుమారుని పెండ్లి కూతురిని
దీవిస్తూ తమ పూవులు రాల్చగ
మైనా – గోరంక మంత్రము చదివెను
చిలకమ్మ మగడంత చిరునవ్వు నవ్వుతూ
చిలకమ్మ మెడకట్టె – చింతాకు పుస్తె



**ఉపాధ్యాయులకు సూచనలు :**

1. 'పెండ్లి సందడి ' ని గురించి విద్యార్థులచేత చెప్పించాలి.
2. చిలకమ్మ పెండ్లిలో ఏ ఏ జంతువులు ఏ పాత్రను చేపట్టింది విద్యార్థులచే చెప్పించాలి.
3. ప్రకృతిలోని దృశ్యాలను విద్యార్థులకు చూపించాలి.

---

## పొరుగువారికి తోడుపడుము

---



## 24 ఆగస్టు 15 (సంభాషణ)




(ఒక ఇంట్లో, తండ్రి, ఆయన పిల్లలు భారతి, వినోద్ లు మాట్లాడుకొంటున్నారు)



వినోద్: అక్కా ! రేపు ఉదయం ఎనిమిది గంటలకే మమ్మల్ని పాఠశాలకు రమ్మన్నారు. జెండా వందనం ఉంటుందట. మాకు చాక్ లెట్లూ, బిస్కట్లూ పెడతారేమో !

భారతి: అవును, పెడతారు. పెట్టకపోయినా ఉదయాన్నే వెళ్ళాలి. మా స్కూలులో కూడా జెండా వందనం ఉంది. రేపు ఆగస్టు 15 కదా.

వినోద్: నాన్నగారూ ! ఆగస్టు 15 న, మనం ఎందుకు పండుగ చేసుకుంటున్నాం ?

తండ్రి: పూర్వం మనదేశం ఆంగ్లేయుల పరిపాలనలో ఉండేది. మనదేశ ప్రజలు అనేక ఉద్యమాలు నడిపారు. మనదేశం నుంచి ఆంగ్లేయులు వెళ్ళిపోవాలని ఆందోళన చేశారు.

భారతి: ఆందోళన చెయ్యగానే, ఆంగ్లేయులు వెళ్లిపోయారా ?



తండ్రి: అంత త్వరగా వెళతారా ! మనదేశానికి స్వాతంత్ర్యం కావాలని మన ప్రజలు, నాయకులు పెద్ద పెద్ద ఉద్యమాలు సాగించారు. లాఠీ దెబ్బలు తిన్నారు. జైళ్ళకు వెళ్ళారు. కొందరు ఉరికంబాలు కూడా ఎక్కారు. ఇంత జరిగిన తర్వాతే ఆంగ్లేయులు మనదేశాన్ని వదలి వెళ్ళారు.

వినోద్ : వాళ్ళు వెళ్ళిపోయి ఎన్నేళ్ళయింది నాన్నగారూ ?
తండ్రి : 1947వ సంవత్సరం, ఆగస్టు 15వ తేదీన, ఆంగ్లేయుల పరిపాలన అంతం అయింది. ఆ రోజున మన భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. అప్పటినుంచీ మనదేశాన్ని మనమే పరిపాలించుకొంటున్నాం.
భారతి : అందువల్ల మనమంతా ఆగస్టు 15నాడు పండగ చేసుకొంటున్నాం అన్నమాట. ఇప్పుడర్థమయింది నాన్నగారూ !
వినోద్ : నాన్నగారూ ! మనదేశంలో జరిగిన ఆ ఉద్యమాలకు నాయకులు ఎవరు ?
తండ్రి : నాయకులు చాలామంది ఉన్నారు. గాంధీ, జవహర్ లాల్ నెహ్రూ, సుభాష్ చంద్రబోసు, భగత్ సింగ్; ఇంకా ఎంతోమంది స్వాతంత్ర్యంకోసం ఉద్యమాలు సాగించి పోరాడారు.
వినోద్ : అయితే ఆగస్టు 15, మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన రోజన్నమాట.
తండ్రి : ఔను మరి.
భారతి
వినోద్ : అందుకే ఆ రోజు మనకు పండగరోజు

* * *



## అభ్యాసం

ప్రశ్నలు :

1. మనదేశాన్ని ఇదివరకు ఎవరు పరిపాలించేవారు ?
2. స్వాతంత్ర్యం కావాలనే ఉద్యమం ఎలా సాగింది ?
3. మనకు స్వాతంత్ర్యం వచ్చింది ఎప్పుడు ?
4. స్వాతంత్ర్యసమరం నడిపిన నాయకుల పేర్లు కొన్ని చెప్పండి.

ఆగస్టు 15 పండగలాగే, మనం దేశమంతటా జరుపుకొనే మరికొన్ని పండుగలు

జనవరి 26 - రిపబ్లిక్ డే
సెప్టెంబరు 5 - ఉపాధ్యాయ దినోత్సవం
అక్టోబరు 2 - గాంధీ జయంతి
నవంబరు 1 - ఆంధ్రప్రదేశ్ అవతరణ
నవంబరు 14 - బాలల దినోత్సవం

జాతి గౌరవమును నిలుపుము



# 25 చెప్పుకోండి చూద్దాం

(పొడుపు కథలు)



1. తడుస్తుంది వానలో – ఆరుతుంది
ఎండలో
విరుస్తుంది బయటకు –
ముడుచుకుంటుంది లోనికి



2. ఇంతింతాకు – ఇంపైన ఆకు
రాజులు మెచ్చిన – రత్నాల ఆకు



3. చిటారు కొమ్మన – మిఠాయి పొట్లం
పటాలనెప్పుడు – పక్కనెయుండు



4. కిందొక పలక – పైనొక పలక
పలకల నడుమ – మెలికల పాము



5. కిట కిట తలుపులు – కిటారి
తలుపులు
ఎప్పుడు తీసిన – చప్పుడు కావు



6. జీవంలేని గరుడ పక్షి
దేశదేశాలు తిరుగుతుంది

**అధ్యాపకులకు సూచనలు :**

1. పొడుపు కథ అనే పేరు ఎట్లా వచ్చిందో పిల్లలకు తెలియజెప్పాలి.
2. పై పొడుపు కథల్లో ఉద్దేశించిన వస్తువుల పేర్లను వారిచేత చెప్పించాలి.

---

## గురువులయెడ భక్తి కలిగి ఉండుము

---



# 26 శిబి చక్రవర్తి

శిబి ఒక గొప్ప చక్రవర్తి. తనను శరణుచొచ్చిన వారిని ఆయన తప్పక రక్షించేవాడు. ఒకసారి ఇంద్రుడు, అగ్నిదేవుడు



అతనిని పరీక్షించ తలచారు. ఇంద్రుడు డేగరూపాన్ని, అగ్నిదేవుడు పావురం రూపాన్ని ధరించారు. పావురాన్ని డేగ తరుముకుంటూ వచ్చింది. పావురం శిబిచక్రవర్తి వద్దకు వచ్చి కాపాడమని కోరింది. దానికి ఆయన అభయమిచ్చాడు. అప్పుడు డేగ "పావురం నా ఆహారం. నీవు దానికి అభయమిచ్చి, నా ఆహారాన్ని నాకు లేకుండా చేశావు. ఇది న్యాయమా ?" అని ప్రశ్నించింది. అపుడు శిబి " అవును, నేను ఈ పావురానికి అభయమిచ్చాను. నీకు కావలసింది ఆహారమే కదా ! ఈ పావురంకాక మరేదైనా ఆహారం కోరుకో !" అన్నాడు. " అయితే పావురమంత బరువుగల మాంసాన్ని నీ శరీరం నుంచి నాకు ఇవ్వాలి " అని డేగ శిబిని అడిగింది. అప్పుడు ఆ చక్రవర్తి తక్కెడను తెప్పించి పావురాన్ని ఒక పళ్ళెంలో పెట్టి తన





తొడనుండి మాంసం కోసి మరో పళ్ళెంలో పెట్టసాగాడు. ఎంత మాంసం కోసిపెట్టినా పావురమే ఎక్కువ బరువు తూగసాగింది. అపుడా చక్రవర్తి తన పూర్తి శరీరాన్ని డేగకు ఆహారంగా ఇవ్వడానికి సంసిద్ధుడయ్యాడు. పళ్ళెంలో కూర్చున్నాడు. అపుడు ఇంద్రుడు, అగ్ని తమ నిజరూపం ధరించి నిలిచారు. శిబి త్యాగబుద్ధిని కొనియాడి అతని శరీరం యధాప్రకారం ఉండేటట్లు చేశారు.

నీతి : ఆపదలో ఉండి శరణుచొచ్చిన వారిని కాపాడుట మన విధి.



II కఠినపదాలు - అర్థాలు :



శరణుచొచ్చుట = కాపాడుమని అడుగుట; రక్షించుట = కాపాడుట; డేగ = సామాన్య పక్షుల్ని, కుందేలు మొదలైన చిన్న జంతువుల్ని వేటాడే బలంగల పక్షి; అభయము ఇచ్చుట = 'భయం లేదు, నేనున్నా' నని చెప్పుట; త్రక్కెడ = తరాజు; సంసిద్ధుడగుట = పూర్తిగా తయారవడం; త్యాగబుద్ధి = గొప్పదానగుణం ; కొనియాడుట = పొగడుట; యథాప్రకారం = ఉండవలసిన విధంగా॥



ప్రశ్నలు :

1. శిబిచక్రవర్తి స్వభావం ఎటువంటిది ?
2. ఇంద్రుడు, అగ్ని ఏ రూపాలను ధరించారు ?
3. శిబిచక్రవర్తి ఎవరికి ఏమని అభయమిచ్చాడు ?
4. అతడు తనమాటను ఏ విధంగా నిలుపుకోగలిగాడు ?
5. మాట నిలుపుకొనుట వల్ల చివరకు అతనికి కలిగిన ఫలమేమిటి ?

ఈ క్రింది ఖాళీలను పూరించండి :

1. ఇంద్రుడు ________ రూపాన్ని ధరించాడు.
2. శిబి చక్రవర్తి పావురానికి ________ ఇచ్చాడు.
3. శిబియొక్క త్యాగబుద్ధిని ________
4. ఎంత మాంసం కోసిపెట్టినా పావురమే ________ ఉంది.

కథననుసరించి సంబంధం కల పదములను జతపరచవలసింది :

ఇంద్రుడు - త్యాగబుద్ధి
అగ్నిదేవుడు - మన విధి
శిబిచక్రవర్తి - డేగ
కాపాడుట - పావురము

ఉపాధ్యాయునికి సూచనలు :

1. త్యాగగుణంగల ఇంకా కొందరు రాజుల చరిత్రను విద్యార్థులకు కథారూపమున చెప్పాలి.
2. త్యాగగుణం విశేషాన్ని విద్యార్థులకు వివరించాలి.

విద్యార్థి కృత్యాలు :

1. శిబి చక్రవర్తి, డేగ-పావురం యొక్క పాత్రలను విద్యార్థులు అభినయిస్తూ సంభాషించాలి.
2. శిబిచక్రవర్తి, డేగ, పావురం ' ముఖం తొడుగు ' లను విద్యార్థులు తయారుచేయాలి.
3. డేగ, పావురం బొమ్మలను గీయాలి.
4. త్యాగగుణంగల ఇతర చక్రవర్తుల చిత్రపటాలను సేకరించాలి.



జీవహింస చేయరాదు



## 27 పట్టుదల

(గేయకథ)

అనగనగా ఒకరాజు
అతని పేరు తైమూరు
పగవారితో యుద్ధంలో
పోరాడి ఓడిపోయె
పోయి పోయి ఒక గుహలో
పొంచి తలదాచుకొనె
ఆలోచనలో మునిగి మునిగి
ఆదమరచి నిద్రపోయె
నిద్ర లేచి మరోసారి
నింపాదిగ యోచించె
పదిలంగా ఒక్క చీమ
పాకుచుండె పై పైకి
పట్టుదప్పి జారి జారి
గట్టుమీద పడిపోయె
తిరిగిలేచి ఆ చీమ
పరుగున పైకెగ బ్రాకె,
పాపం ! ఆ చిన్నిచీమ
పట్టుదప్పి మరోసం
పట్టువిడని ఆ చీమ
గట్టి యత్నమొనరించె
ఏడుసార్లు ఎగబ్రాకి
ఏడుసార్లు కిందబడియె

అయిన పట్టు విడువకుండ
అసలు గమ్యమును చేరె
ఓడిపోయిన రాజపుడు
ఒక్కసారి లేచినాడు
కత్తి చేత ధరియించి
కదనానికి కదలినాడు
విజయమ్మును పొందినాడు
విజేతగా వెలిగినాడు.



**ఉపాధ్యాయులకు సూచనలు :**

1. గేయంలోని నీతిని విద్యార్థులకు వివరించాలి.
2. ఈ నీతిని విద్యార్థులు తెలిసికొనేటట్లు ఇంకా ఇలాంటి ఉదాహరణలివ్వాలి.

**విద్యార్థి కృత్యాలు :**

1. పాట పాడుతూ అభినయించాలి.
2. అందరూ కలిసి పాడుతుండగా ఒకడు రాజుగా అభినయించాలి.





# 28 పొగరుబోతు కుక్క

ఒక పొగరుబోతు కుక్క ఉంది. అది అందరినీ కరవసాగింది. దాని కాటుకి చాలామంది గురి అయ్యారు. దాని యజమానికి చిరాకు పుట్టింది. ఆయన కుక్కమెడలో ఒక గంట వేలాడకట్టాడు. ఆ గంట చప్పుడు విని జనం జాగ్రత్తపడేవారు. దూరంగా పరుగెత్తి పోయేవారు. ఆ గంట కట్టిన నాటినుంచి పొగరుబోతు కుక్కకు మరింత గర్వం పెరిగింది.



" గణ గణ మోగే ఈ గంట చూశావా ? ఇది నాకెంత అందంగా ఉందో ! నా గొప్పతనం చూసి యజమాని ఈ గంట నా మెళ్లో వేశాడు తెలుసా ? " అన్నట్లు ఆ కుక్క గర్వంతో ఇతరుల వంక చూచేది.

ఒక ముసలికుక్క దాని అజ్ఞానానికి నవ్వుకుంది. " వెర్రిదానా ! అది నీకు అలంకారం కాదు. నీ పొగరుబోతుతనానికి గుర్తు. ఆ గంట చప్పుడు విని అందరూ నీకు దూరంగా పారిపోతున్నారు. అంతే !" అని పొగరబోతుకుక్కకు ముసలికుక్క బుద్ధి చెప్పింది. "అదా సంగతి ?" అని సిగ్గుపడిపోయింది పొగరుబోతు కుక్క.



అల్పుడు అవమానాలకు కూడా ఆనందపడతాడు.

– చొక్కారపు వెంకటరమణయ్య



## అభ్యాసవేదిక

**కఠినపదాలు :**

గురి = లక్ష్యం; చిరాకు = విసుగు; అజ్ఞానం = తెలివితక్కువతనం; అలంకారం = సొమ్ము, అందాన్ని కల్గించేది; అల్పుడు = కొంచెపు బుద్ధి కలవాడు.

### ప్రశ్నలు

1. పొగరుబోతు కుక్క పొగరు అణచేందుకు యజమాని ఏం చేశాడు ?
2. ముసలికుక్క పొగరుబోతు కుక్కకు ఎలా బుద్ధి చెప్పింది ?
3. ఈ పాఠంలోని నీతి ఏమి ?

**ఖాళీలను పూరింపుము :**

1. దాని కాటుకి చాలామంది ______ అయ్యారు.
2. ఆయన ______ ఒక గంట వేలాడగట్టాడు.
3. గంటచప్పుడు విని ______ జాగ్రత్తపడేవారు.
4. ముసలికుక్క దాని ______ నవ్వుకొంది.
5. వెర్రిదానా అది నీకు ______ కాదు.

**జతపరుచుము :**

| | | |
|---|---|---|
| యజమానికి | — | బుద్ధిచెప్పింది |
| పొగరుబోతుకుక్క | — | గణగణ మోగింది |
| ముసలికుక్క | — | చిరాకు పుట్టింది |
| గంట | — | గర్వంతో చూచేది |

**ఉపాధ్యాయులకు సూచనలు :**

పొగరుబోతు - అజ్ఞానం - అలంకారం - బుద్ధిచెప్పుట అను పదాలను ఉదాహరణలతో వివరించాలి.

**విద్యార్థి కృత్యాలు :**

1. పొగరుబోతుకుక్క - ముసలికుక్క పాత్రలను ధరించి సంభాషించాలి.
2. కుక్కముఖాల తొడుగులను తయారు చేసుకోవచ్చు.
3. ' కుక్క ' బొమ్మ గీయాలి.
4. ఈ కథను విద్యార్థుల సొంతవాక్యాలలో చెప్పాలి.

---

దుష్టులకు దూరముగా ఉండుము.

---



# 29 ఎప్పుడు (పాట)



కన్నులు రెండు దృశ్యాల్
కనుచుండుటకు
కన్నులతో మంచివాని
కనుము ఎప్పుడు



వీనులు రెండు మాటలు
వినుచుండుటకు
వీనులతో మంచిమాట
వినుము ఎప్పుడు



చేతులు రెండు పనులు
చేసుకొనుటకు
చేతులతో మంచి పనులు
చేయుమెప్పుడు



కాళ్ళు రెండు ఎచటికైన
కదలిచనులకు
కాళ్ళతోను మంచిచోట్ల
కరుగుమెప్పుడు

పెదవులు రెండు – పలుకులు
పలుకుచుండుళ్ళకు
పెదవులతో ప్రేమగాను
పలుకుమెప్పుడు





– శ్రీ బండారు ప్రసాదరావు

**ఉపాధ్యాయులకు సూచనలు :**

1. ఈ గీతాన్ని విద్యార్థులచే అభినయం చేయించి పాడించాలి.
2. కనులు - చెవులు - చేతులు - కాళ్ళు - పెదవులు చేయుపనులను విద్యార్థులకు తెలియజెప్పాలి.

---

సత్యం పలుకుము

---

# 30 న్యూటన్ కథ (పాట)



యాపిల్ చెట్టు నీడన
బాబయ్యొక్కడు ఉన్నాడు
ఏవో ఏవో ఊహలతో
ఏదో లోకానున్నాడు !
రివ్వున గాలీ వీవంగ
పండిన పండూ రాలంగా
ఈ లోకంలో కొచ్చాడు
ఇలాగా అనుకున్నాడు
" పండిన పండూ పైకీ పోక
నేలను ఎందుకు రాలాలి ?"
అంటూ యోచన చేశాడు
ఫలితం ఇలాగ తేల్చాడు
"భూమికి ఉందొక ఘనశక్తి
ఆకర్షణయే ఆ శక్తి"!
అలాగ చెప్పిన బాబయ్యే
'న్యూటన్' అని మరి తెలియండి.



—శ్రీ పి. నాసరయ్య



ఉపాధ్యాయులకు సూచనలు :

1. శాస్త్రజ్ఞుడంటే ఎవరో వివరించి న్యూటన్ ఒక గొప్ప శాస్త్రజ్ఞుడని చెప్పాలి.
2. భూమ్యాకర్షణ శక్తిని గురించి వివరించి బంతిని ఉదాహరణగా తీసికొని విద్యార్థులకు ఆకర్షణాశక్తిని గూర్చి తెలుపాలి.

# 31 జగదీశ చంద్రబోసు



మొక్కలకు కూడా ప్రాణముంది. అవి మనవలెనే పెరుగుతాయి. రోజు రోజుకు వాటి పెరుగుదలలో మార్పు కనిపిస్తుంది. ఈ విషయాన్ని ప్రయోగం ద్వారా లోకానికి చాటిన విజ్ఞానవేత్త జగదీశ చంద్రబోసు. ఆయన గొప్ప శాస్త్రజ్ఞుడు.

జగదీశ చంద్రబోసు ఇప్పటి బంగ్లాదేశ్‌లో ఉన్న మైమెన్‌సింగ్ గ్రామంలో 1858వ సంవత్సరం నవంబరు 30వ తేదీన జన్మించాడు. ఆయనది మంచి సంప్రదాయంకల కుటుంబం. ఆయన భారత రామాయణాలను చిన్ననాటనే చదివాడు. కలకత్తాలోని సెంట్ జేవియర్ పాఠశాలలో విద్యనభ్యసించాడు. అంతేకాదు కలకత్తాలో భౌతిక శాస్త్రం చదివి, ఆ పిదప కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో ప్రవేశించాడు. అక్కడ బి.యస్‌సి., చదువు పూర్తి చేసుకొని 1884వ సంవత్సరంలో స్వదేశానికి తిరిగి వచ్చాడు. కలకత్తాలోని ప్రెసిడెన్సీ కళాశాలలో ఉపన్యాసకుడుగా చేరాడు.

ఆ రోజులలోనే మొక్కలకు కూడా ప్రాణముందని బోసు అంటుంటే అంతా నవ్వేవారు. కాని పట్టుదలతో ప్రయోగాలుచేసి ఆయన తన మాటను నెగ్గించుకున్నాడు. 1901వ సంవత్సరం మే నెల 10వ తేదీన లండన్‌లోని రాయల్ సొసైటీ హాలులో మొక్కలపైన తాను చేసే ప్రయోగాన్ని ప్రదర్శించాడు. ఆ ప్రయోగంలో మొక్కకు విషాన్ని ఇవ్వగా అది చనిపోయింది. ప్రత్యక్షంగా దీనిని చూచిన రాయల్‌సొసైటీవారు 1920లో బోసుకు తమ

సంఘంలో సభ్యత్వమిచ్చి గౌరవించారు. ఈ విధంగా బోసు గొప్ప శాస్త్రజ్ఞుడుగా ఖ్యాతిని పొందాడు.

## అభ్యాసవేదిక

**కఠినపదాలకు అర్థాలు :**

ప్రయోగం = చేసి చూపడం; శాస్త్రజ్ఞుడు = విజ్ఞాన శాస్త్రం తెలిసిన వాడు; జన్మించాడు = పుట్టాడు; సంప్రదాయం = పరంపరగా వచ్చే ఆచారం, అలవాట్లు; అభ్యసించడం = నేర్చుకొనటం; ప్రవేశించడం = చేరడం; స్వదేశం = సొంతదేశం, పుట్టినదేశం; ప్రదర్శించడం = చూపడం; సొసైటీ = సంఘం; ఖ్యాతి = కీర్తి.

## ప్రశ్నలు

1. మొక్కలకు ప్రాణముందని కనిపెట్టిన వారెవరు ?
2. జగదీశ చంద్రబోసు ఎక్కడ, ఎప్పుడు జన్మించాడు ?
3. ఆయన కుటుంబమెటువంటిది ?
4. ఆయన ఎక్కడెక్కడ విద్యనభ్యసించాడు ?
5. ఆయన తన ప్రయోగాన్ని ఎక్కడ ప్రదర్శించాడు ?
6. బోసుకు సభ్యత్వమిచ్చి గౌరవించిన సొసైటీ పేరేమి ?

**ఖాళీలను పూరింపుము :**

1. గొప్ప శాస్త్రజ్ఞుడు ________
2. జగదీశ చంద్రబోసు ________ ________ చిన్న నాటనే చదివాడు.
3. జగదీశ చంద్రబోసు పట్టుదలతో ________ చేశాడు.
4. మొక్కకు విషాన్ని ఇవ్వగా అది ________
5. ________ బోసుకు సభ్యత్వమిచ్చి గౌరవించారు.

**ఉపాధ్యాయులకు సూచనలు :**

1. శాస్త్రజ్ఞుడు అనే పదాన్ని పరిచయం చేసి, ఇంకా ఇతర శాస్త్రజ్ఞులను గురించి వివరించాలి.
2. శాస్త్రజ్ఞులు కనుగొన్న విషయాలు మానవజాతికి ఏవిధంగా ఉపయోగపడతాయో తెలియజేయాలి.
3. అత్తపత్తి మొక్కను తాకగానే ఎలా ముడుచుకుంటుందో ప్రత్యక్షంగా చూపించి మొక్కలుగూడ భయపడతాయని తెలియజేయాలి.

**విద్యార్థి కృత్యాలు :**

1. పిల్లలు మొక్కల పెరుగుదలను గమనించాలి.
2. పిల్లలు జట్లుగా చేరి మొక్కలు పెంచడం నేర్చుకోవాలి.
3. శాస్త్రజ్ఞుల చిత్రపటాలను సేకరించాలి.
4. రకరకాల మొక్కల పెంపకంవలన లాభాలు తెలుసుకోవాలి.



# 32 సుభాషితరత్నాలు (కంఠస్థం చెయ్యవలసినవి)



దండమయా విశ్వంభర !
దండమయా పుండరీకదళనేత్ర ! హరీ !
దండమయా కరుణానిధి !
దండమయా నీకు నెపుడు దండము కృష్ణా ! 1

అక్కరకు రాని చుట్టము,
మ్రొక్కిన వరమీని వేల్పు, మోహరమున తా
నెక్కిన పారని గుర్రము
గ్రక్కున విడువంగ వలయు గదరా సుమతీ ! 2

చుట్టములు గాని వారలు
చుట్టములము నీకటంచు సొంపు దలర్పన్
నెట్టుకొని యాశ్రయింతురు
గట్టిగఁ ద్రవ్యంబు గలుగఁ గదరా సుమతీ ! 3

వినఁదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింప దగున్
కనికల్ల నిజముఁ దెలిపిన
మనుజుఁడేపో నీతి పరుఁడు మహిలో సుమతీ ! 4

పూజకన్న నెంచ బుద్ధి నిదానంబు,
మాటకన్న నెంచ మనసు దృఢము,
కులముకన్న మిగుల గుణము ప్రధానంబు
విశ్వదాభిరామ, వినురవేమ !



నీళ్ళలోన మొసలి నిగిడి యేనుగు పట్టు
బయట కుక్క చేత భంగపడును,
స్థానబలిమి గాని తన బల్మి కాదయా;
విశ్వదాభిరామ, వినురవేమ ! 6

అనగననగ రాగ మతిశయిల్లుచునుండు
తినగ తినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన;
విశ్వదాభిరామ, వినురవేమ ! 7



వెండి కొండ పసిఁడి కొండయుఁ దనకుండ
దేవుఁడేల పోయి తిరిపెమెత్తె ?
దైవబలము కాని తన బల్మి కాదయా
విశ్వదాభిరామ, వినురవేమ. 8

వీడు పరులవాడు వాడు నావాడని,
అల్పబుద్ధి తలచు ఆత్మయందు ;
సాధుపుంగవులకు జగమే కుటుంబంబు
లలిత సుగుణజాల ! తెలుగుబాల ! 9



అక్షరంబు వలయు కుక్షి జీవనులకు
నక్షరంబు జిహ్వకిక్షు రసము
అక్షరంబు తన్ను రక్షించు గావున
నక్షరంబు లోక రక్షితంబు. 10



విద్యార్థులకు వివరణలు :

ఉపాధ్యాయులకు సూచనలు :

I. 1. విశ్వంభర ! = ప్రపంచాన్ని భరించే భగవంతుడా !

పుండరీక దళనేత్ర = తామర రేకులవంటి అందమైన కన్నులుగలవాడా

కృష్ణశతకము, నరసింహకవి రచన.

2. మోహరము = యుద్ధం; గ్రక్కున = వెంటనే.

3,4 పద్యాలు సుమతి శతకంలోనివి. 'సుమతి శతకము' బద్దెనకవి రచన.

5, 6, 7, 8 వేమన శతకము వేమనకవి రచన.

'విశ్వద + అభిరామ ! వినురవేమ !' = 'ప్రపంచాన్ని ప్రసాదించిన పరమాత్మనల్ల ప్రబోధించుకొన్నట్లుగా శతకంలో నీతులు ఉపదేశించాడు.

విగిడి = విక్కి

9. సాధుపుంగవులు = సజ్జన శ్రేష్ఠులు. 'తెలుగుబాల' కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రి రచన.

10. చాటుకవి పద్యం.

II. పది పద్యాలలోని భావం ఉపాధ్యాయులు విద్యార్థులకు వివరించి, అందులోని నీతిని వారి మాటలలో వారిచేత చెప్పించాలి.



# 33 మన జెండా

జాతి జెండా ప్రతిష్ఠకు చిహ్నం. జాతీయమైన మనజెండా మన ప్రాచీన ఔన్నత్యాన్ని, సంప్రదాయాన్ని, ఆదర్శాలను తెలుపుతుంది. ఇది మువ్వన్నె జెండా. జెండాలోని కాషాయం, ఆకుపచ్చ రంగులు హిందూ మహమ్మదీయ మతాల చిహ్నాలని చాలా మంది ఆందోళన చేశారు. అప్పుడు 1931 సంవత్సరంలో శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి అధ్యక్షతన ఒక సంఘం ఏర్పడి త్యాగానికి కాషాయపురంగు, పవిత్రతకు తెలుపురంగు, అభివృద్ధికి ఆకుపచ్చరంగు గుర్తులని తేల్చి చెప్పారు. తెలుపురంగు మధ్యలో ఉన్న రాట్నాన్ని పేదల పాలిటి పెన్నిధిగా వర్ణించారు. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఈ మువ్వన్నె జెండాలో రాట్నానికి బదులుగా అశోకుని ' ధర్మచక్రాన్ని ' చిత్రించారు. ఇదే మన జాతీయ జెండా.

జాతీయ పర్వదినాలలో ఈ జెండాను మనం ఎగురవేస్తాం. వందనం చేస్తాం. మనకు 1947 ఆగస్టు 15వ తేదీన స్వాతంత్ర్యం వచ్చింది. ఆనాడు 'ఢిల్లీలోని ఎర్రకోటపై మన తొలి ప్రధాని శ్రీ పండిత జవహర్ లాల్ నెహ్రూ మన జాతీయ జెండాను ఎగురవేశారు. 'జనగణమన' జాతీయగీతాన్ని పాడారు.



అహింసయే పరమ ధర్మం

## అభ్యాసవేదిక

**కఠినపదాలు – అర్థాలు :**

ప్రతిష్ఠ = కీర్తి; చిహ్నం = గుర్తు; ప్రాచీన = పురాతన; ఔన్నత్యం = గొప్పతనం; సంప్రదాయం = ఆచారం; ఆదర్శం = అనుసరించదగిన మార్గం; మువ్వన్నె = మూడురంగులు; ఆందోళన = మనసులోని గందరగోళం; త్యాగం = తనకంటూ ఏమిలేకుండా వదలుకొనుట; పవిత్రత = శుద్ధమైన; వృక్షం = చెట్టు; పర్వదినం = పండుగదినం ; స్వాతంత్ర్యం = స్వేచ్ఛ ; తొలి = మొదటి.

### ప్రశ్నలు

1. జాతిజెండా దేనికి చిహ్నం ?
2. మన జెండా దేనిని తెలుపుతుంది ?
3. మువ్వన్నె జెండా అంటే అర్థం ఏమిటి ?
4. జెండాలోని ఏ ఏ రంగులు వేనికి గుర్తులు ?
5. కాంగ్రెసుజెండా మధ్యలో ఏముంటుంది ?
6. మన తొలి ప్రధాని ఎవరు ?
7. ఆయన మనజెండానెప్పుడు ఎగురవేశారు ?
8. మన జాతీయగీతం ఏది ?

**ఈ క్రింది ఖాళీలను సరియైన పదాలతో పూరించాలి :**

1. జెండా మధ్యలో ధర్మచక్రాన్ని ______

(చింతించారు, చిత్రించారు)

2. జాతీయ ______ జెండాను ఎగురవేస్తాం

(పరదినాలలో, పర్వదినాలలో)

3. మన తొలి __________ పండిత జవహర్ లాల్ నెహ్రూ
(ప్రధాని,నాయకుడు)

**ఉపాధ్యాయులకు సూచనలు :**

1. ' అశోక ధర్మచక్రం ' అనే పదాన్ని వివరించడం. దాన్ని మన జెండాలో ఎందుకు చిత్రించారో తెలపాలి.
2. ' జనగణమన' జాతీయగీతాన్ని పాడేటప్పుడు విద్యార్థులు ఏం చేయాలో చెప్పాలి. జాతీయగీతాన్ని ఎవరు రాశారో చెప్పాలి.
3. ప్రతిదేశానికి ఒక జెండా ఉంటుందని, అటువంటి వాటిని కొన్నిటిని పరిచయం చేయవచ్చును.
4. మనదేశపు ఇతర చిహ్నాలను గూడ పరిచయం చేయవచ్చు.

**విద్యార్థి చేయవలసిన పనులకు సూచనలు :**

1. మన జెండాను గీసి రంగులు వేయించడం.
2. జెండా వందనం కార్యక్రమంలో పాల్గొనునట్లు చేయడం.
3. జెండా పాటలను నేర్చుకొని పాడడం.
4. పిల్లలను గ్రూపులుగా చేసి ఒక్కొక్క గ్రూపుకు ఒక్కొక్క కృత్యము అప్పగించుట.

ఉదా॥ ఒక గ్రూపు జెండాలోని రంగులు వాని ప్రాముఖ్యం రాయడం. ఇంకొక గ్రూపు పాఠశాలలో జరిగిన పండుగలో జెండా వందనం చేసిన విధానాన్ని రాయడం మొదలగునవి.

(జాతీయ పతాకం లోపలి అట్టమీద రంగులలో ముద్రించబడినది.)





# ఆకారాది క్రమపట్టిక

ఐ

43. ఐకమత్యం

ఒ

44. ఒనరించు

ఓ

45. ఓడిపోవు

ఔ

46. ఔన్నత్యం

క

47. కదనం

48. కనుము

49. కనురెప్పలు

50. కంచి

51. కరుణానిధి

52. కల్పవల్లి

53. కల్ల

54. కలిమి

55. కషాయం

56. కాటు

57. కా[illegible]

58. కాలక్షేపం

59. కార్తీకం

60. కిరణం

61. కీర్తి

62. కుటుంబం

63. కృప

64. క్రిష్టమస్

65. కృష్ణపక్షం

66. కొనియాడు

67. క్రొత్త

ఖ

68. ఖ్యాతి

గ

69. గండుచీమ

70. గమ్యం

71. గరుడపక్షి

72. గర్వం

73. గుండ్రం

74. గురి

75. గుహ

76. గోదావరి

77. గౌరవం

ఘ

78. ఘనులు

జ్ఞ

79. జ్ఞానం

చ

80. చక్రవర్తి

81. చతుర్దశి

82. చందనం

83. చవితి

84. చాపు

85. చిటారు

86. చింతాకు

87. చిత్రించటం

88. చినుకులు

89. చిరాకు

90. చిహ్నం

91. చెరువు

92. చెలికత్తె

93. చేరుట

94. చైత్రం

జ

95. జగము
96. జన్మించుట
97. జాగ్రత్త
98. జాతి
99. జీవరాసులు
100. జీవహింస
101. జెండా
102. జ్యేష్ఠం

ఝ

103. ఝుమ్మని

డ

104. డప్పులు
105. డమరువు

త

106. తక్కెడ
107. తంబూర
108. తదియ
109. త్రయోదశి
110. తరుము
111. తిథులు
112. త్యాగబుద్ధి
113. తుమ్మెద
114. తూర్పు
115. తెలుగుగడ్డ
116. తెలుగుభాష
117. తేజం
118. తేనెపట్టు
119. తేళ్ళు
120. తైమూరు
121. తౌశి

ద

122. దశమి
123. దర్శనం
124. దక్షిణం
125. ద్వారం
126. దిక్కులు
127. దివ్యమూర్తి
128. దీవి
129. దీవించు
130. దుష్టులు
131. దేవాలయం
132. దైవం

ధ

133. ధర
134. ధర్మచక్రం
135. ధరించు

న

136. నందనం
137. నవమి
138. నిగిడి
139. నింపాదిగా
140. నియమం
141. న్యాయమూర్తి
142. నీతి
143. నీతిపరుడు
144. న్యూటన్
145. నృత్యం
146. నెలలు

ప

147. పంచమి
148. పంచాంగం
149. పండుగ
150. పందిట

151. పచ్చడి
152. పతనం
153. పటాలం
154. పట్టుదల
155. పట్టుదప్పి
156. పరమధర్మం
157. పర్వతం
158. పర్వదినం
159. పవిత్రత
160. పశువులు
161. పక్షం
162. పక్షులు
163. ప్రతిష్ట
164. ప్రకృతి
165. ప్రత్యక్షం
166. ప్రధానం
167. ప్రధానం
168. ప్రభవ
169. ప్రపంచం
170. ప్రయత్నం
171. ప్రయాణం
172. ప్రవేశించు
173. ప్రయోగం
174. ప్రదర్శన
175. పాఢ్యమి
176. ప్రాకు
177. ప్రాచీనం
178. పిచ్చుకలు
179. పిన్న
180. పుట్టుట
181. పురాణం
182. పుష్యం
183. పుస్తె
184. పెన్నిధి
185. పొంచి
186. పొగరు
187. పొరుగు
188. పోరాటం
189. పౌర్ణమి

ఫ

190. ఫలితం
191. ఫాల్గుణం

బ

192. బంధువులు
193. బంగాళాఖాతం
194. బలిమి
195. బాక
196. బాబయ్య
197. బింకం
198. బింబం
199. బొజ్జ
200. బోయవాడు

భ

201. భక్తి
202. భంగపడుట
203. భటులు
204. భాద్రపదం
205. భారతీయులు
206. భూమి
207. భౌతికశాస్త్రం

మ

208. మంత్రం

209. మతం

210. మడి

211. మల్లిక

212. మార్గశిరం

213. మాఘం

214. మాధవీలత

215. మిడిమేలపు

216. మిడుకుట

217. మిత్రులు

218. మీటులు

219. మువ్వన్నె

220. మూకలు

221. మూలలు

222. మెరుపులు

223. మెలగు

224. మేత

225. మేఘాలు

226. మేలు

227. మేలిమి

228. మొద్దు

229. మోహరం

230. మ్రోగు

య

231. యత్నం

232. యథాప్రకారం

233. యూపీల్

234. యుద్ధం

235. యోచన

ర

236. రత్నాలు

237. రాట్నం

238. రివ్వున

239. రేరాజు

ల

240. లత

241. లోకం

వ

242. వందనం

243. వర్ణించు

244. వర్షం

245. విజేత

246. విజయం

247. విధి

248. విదియ

249. విశ్వం

250. విశ్వంభర

251. వ్యక్తం

252. వేరు

253. విల్లు

254. వివరించు

255. వీనులు

256. వీవంగ

257. వెన్నెల

258. వైద్రిది

259. [illegible]

260. వేము
261. వేకువ
262. వేణువు
263. వైశాఖం

శ

264. శరణం
265. శ్రవణం
266. శాంతి
267. శాస్త్రజ్ఞుడు
268. శ్రావణం
269. శుక్లపక్షం

ష

270. షష్ఠి

స

271. సంఘం
272. సందడి
273. సంసిద్ధుడు
274. సంప్రదాయం
275. సముద్రం
276. సవ్వడి
277. సహనం
278. సప్తమి
279. సభ్యత్వం
280. సంవత్సరాది
281. సాధనమున.
282. సాధుపుంగవులు
283. సాయంకాలం
284. సాలీడు
285. సత్యం
286. స్వదేశం
287. సింగారం
288. సింహాళం
289. సుందరం
290. సుఖం
291. సాగను
292. సొసైటీ

